# సోంగ్క్రాన్

-ఆరి సీతారామయ్య

అర్ధరాత్రవుతున్నా లమాయికి ఇంకా నిద్రరాలేదు. ఆమె మనసు స్థిమితంగా లేదు. తన జీవితానికి దారీతెన్నూ లేకుండాపోయింది. తన బిడ్డ జీవితమయినా బాగా ఉంటుందనే ఆశతో పదిహేను సంవత్సరాల క్రితం థామస్ ని నమ్ముకుని అమెరికా వచ్చిందామే. ఇప్పుడు ఆ ఆదరువూ లేదు. తనంతట తాను కూతురుని చదివించుకోగల సమర్ధత తనకు లేదు. మరేదీ దిక్కు? తనలాంటివాళ్ళ బిడ్డలకు పెద్దగా ఆశలుపెట్టుకునే హక్కు లేదేమో!

తెల్లవారితే సోంగ్క్రాన్ పండుగ. కొత్త సంవత్సరం వస్తుంది. చాంగ్ మై లో ఎంత సందడిగా ఉంటుందో. పొద్దున తొందరగా తయారై అమ్మానాన్నలతో, చెల్లెలు కోసుమ్ తో హరిపుంజయ బౌద్ధాలయానికి వెళ్ళటం, దోవలో ఎదురైనవాళ్ళు నీళ్ళు చల్లి, సవా బిపిమై (కొత్త సంవత్సరం శుభాకాంక్షలు) చెప్పడం తలపుకొచ్చాయి. ఇంటికొచ్చేసరికి అందరూ బాగా తడిసి ముద్దైపోయేవారు. పాత సమస్యలన్నీ నీళ్ళలో కొట్టుకుపోతాయని అందరి నమ్మకం. కొత్త సంవత్సరం తన సమస్యలనుకూడా కడిగేసి, ఏదైనా కొత్త మలుపు ప్రసాదిస్తుందేమో.

థాయ్ లాండ్ కి దూరంగా ఉన్నా, పండగరోజులు మంచి రోజులు. ముఖ్యమైన పనులేమైనా మొదలు పెట్టాలంటే అలాంటి శుభదినాల్లో మొదలుపెడితే సఫలమవుతాయని తల్లిదండ్రులు అంటుండేవారు. క్రోగర్ స్టోర్ లో తనతో పనిచేసే మేనేజర్ కెవిన్ ని రేపు భోజనానికి పిలిస్తే బాగుంటుందనిపించింది లమాయికి. అతను మంచి మనిషి. తనకు దాదాపు పది సంవత్సరాలుగా తెలిసిన మనిషి. తరచూ తన మంచిచెడ్డలగురించి అడుగుతూ ఉంటాడు. తన తప్పు ఏదీ లేకపోయినా థామస్ తనను వదిలేశాడని తెలిసినప్పుడు బాగా విచారించాడు కూడా. పొద్దుటే ఫోన్ చేసి భోజనానికి రమ్మని పిలవాలి. ఎటూ పండగ వంటకాలు చెయ్యాలనుకుంటుంది. థాయ్ వంటలు తనకు ఇష్టమేనని చెప్పినట్లు గుర్తు.

*

తొందరగా లేచి, స్నానం ముగించి, బుద్ధుడి విగ్రహాన్ని కడిగి నమస్కారం చేసి, కెవిన్ కి ఫోన్ చేసింది లమాయి. అతను భోజనానికి వస్తానన్నాడు. సంతోషంగా ఫోన్ కాల్ ముగించి కూతురి గది వైపు అడుగులేస్తూ, "మాలీ… మాలీ," అని పిలిచింది లమాయి.

అప్పటి దాకా సమాధానం చెప్పని మాలీ, తల్లి తలుపు దగ్గరకు రాగానే, "ఎందుకట్లా అరుస్తావు? ఎటూ వస్తున్నావు కదా? అరుస్తూ రాకపోతే ఏం? ఎదురుగా వచ్చి చెప్పరాదూ ఆ చెప్పేదేంటో," అని రుసరుస లాడింది.

తల్లికివ్వాల్సిన గౌరవం కూడా ఇవ్వకుండా, పెద్దాచిన్నా గమనింపులేకుండా, కూతురు ఇలా తననే మందలించడం ఇది మొదటిసారి కాదు. అయినా ఇలాంటి అవమానాలను భరిస్తూ, మనసుపడే కష్టాన్ని బయటకు రానివ్వకుండా నెట్టుకొస్తుంది లమాయి. మొదటినుండీ అతిగారాబం చెయ్యకుండా, థాయ్ అమ్మాయిని పెంచినట్లు పెంచినట్లయితే బాగానే ఉండేది. కానీ ఇప్పుడు దాని గురించి బాధపడి ప్రయోజనం లేదు.

"ఎందుకూ అంత కోపంగా ఉన్నావ్? ఒంట్లో బాగాలేదా?" అంటూ దగ్గరకొచ్చి నుదుటిమీద చెయ్యి పెట్టిచూడబోయింది లమాయి.

రెండడుగులు వెనక్కేసి, "బాగానే ఉన్నాలే. ఏంటీ చెప్పొచ్చావ్?" అని అడిగింది మాలీ.

"ఆదా," ఎంతో ఆప్యాయంగా కూతురి నుదుటిని తాకబోయిన మనిషి వాస్తవ ప్రపంచంలోకి వచ్చి, "ఈ రోజు సోంగ్క్రాన్. ఒక ఫ్రండ్ ని భోజనానికి రమ్మని పిలిచాను. నువ్వు ఇంట్లో నే ఉంటావుగా?" అంది లమాయి.

"బాయ్ ఫ్రండా?" అసమ్మతీ, తిరస్కారం కలగలిపిన స్వరంతో అడిగింది మాలీ.

"అవును," అంది లమాయి. చాలా మాటలు ఉబికి వస్తున్నాయి లోపలనుండి, కానీ వాటిని లోపలే అదిమిపెట్టిందామే.

"నేను ఫ్రండ్స్ తో బయటికెళ్తున్నాను," సంభాషణ తెంచేస్తున్నట్లు అంది మాలీ, బీరువా తెరిచి బట్టలవైపు చూస్తూ.

"సోంగ్క్రాన్ పండుగ రోజు. నీకిష్టమైన వంటలు చేస్తాను. ఇంటిదగ్గర ఉండరాదూ?" బ్రతిమిలాడుతున్నట్లడిగింది లమాయి.

"నేనొస్తానని చెప్పాను ఫ్రండ్స్ తో," ఆమె వైపు చూడకుండానే సమాధానం చెప్పింది మాలి.

“సరే, నీ ఇష్టం,” అని వెళ్ళిపోయింది లమాయి, చిరాగ్గా.

*

దాదాపు పదిసంవత్సరాలుగా క్రోగర్ స్టోర్ లో తనతో పనిచేస్తున్న లమాయి ఈరోజే భోజనానికి రమ్మని పిలవడంతో ఆమె ఏదో ఇబ్బందిలో ఉండి ఉంటుంది, తన సహాయం అడగటం కోసం రమ్మంటుంది అనుకున్నాడు కెవిన్. అతను వచ్చేసరికి వంట పూర్తిచేసి ఏపార్ట్ మెంట్ శుభ్రంగా సరిచేసింది లమాయి. అతను అడక్కుండానే ఈరోజు థాయ్ దేశస్థులకు నూతన సంవత్సరం అనీ, థాయ్ లాండ్ లో, ముఖ్యంగా తమ చియాంగ్ మయ్ లో, పెద్దఎత్తున పండగ జరుపుకుంటారనీ, కుటుంబ సభ్యులతో, స్నేహితులతో సంతోషంగా గడిపే రోజనీ చెప్పింది లమాయి.

కెవిన్ మనసు కుదుటపడింది. భోజనాలయింతర్వాత కూతురు ఏం చేస్తుందని అడిగాడు. ప్రస్తుతం కమ్యూనిటీ కాలేజీకి వెళుతుందనీ, శ్రద్ధగా చదువుతుందనీ, సెప్టెంబర్ నుంచీ ఏదైనా మంచి కాలేజీలో చేర్పించాలనీ చెప్పింది లమాయి. ఏదైనా పార్ట్ టైమ్ ఉద్యోగం అవసరం అయితే క్రోగర్ లో పనిచెయ్యవచ్చు అన్నాడతను. ఆ సూచనకు సంతోషం వ్యక్తపరుస్తూ, ఆ అమ్మాయికి మెడిసిన్ చదవాలనే కోరిక వుందనీ, ప్రస్తుతం బోమాంట్ హాస్పిటల్లో పార్ట్ టైమ్ ఉద్యోగం చేస్తుందనీ చెప్పిందామె.

*

ఫ్రెండ్స్ ని కలవటానికి బయటికెళ్తున్నానని చెప్పినా మాలీకి పెద్దగా స్నేహితుల్లేరు. నాలుగు సంవత్సరాల వయసులో తల్లితో అమెరికా వచ్చిన మాలీకి పక్కింటి పిల్లలతోగానీ, వీధిలో పిల్లలతోగాని స్నేహాలు కుదరలేదు. తన ముఖం వేరుగా కనబడటంతో, ఇంగ్లీషు రాకపోవడంతో, వీధిలో పిల్లలెవరూ వాళ్ళ ఆటల్లో తనను చేర్చుకోలేదు. బిడియంగా తను దూరంగానే ఉండిపోయింది. స్కూల్లో చేరిన తర్వాత కూడా తను పరాయిదేశపు అమ్మాయిననే ఆలోచనే బలపడింది. ఒంటరిగా కూర్చుని ఏదో పుస్తకం చదవడం, లైబ్రరీకెళ్ళి హోమ్ వర్క్ చేసుకోవడం అలవాటు చేసుకుంది గాని పెద్దగా స్నేహాలు కుదుర్చుకోలేక పోయింది.

మొదట తను అమెరికా ఎందుకు వచ్చిందో అర్థం కాకపోయినా, క్రమంగా తల్లి తనను అమెరికా ఎందుకు తీసుకొచ్చిందో గ్రహించింది. భర్త ఆమెను మాలీకి సంవత్సరం కూడా రాక ముందే వదిలేశాడు. రెండు మూడు సంవత్సరాలు తల్లిదండ్రుల్తో చియాంగ్ మయ్ లో ఉంటూ వాళ్ళ కిరాణా కొట్టు నడపటంలో సహాయపడుతూ గడిపిందామె. అనుకోకుండా చియాంగ్ మయ్ వచ్చిన థామస్ తో పరిచయం కావడం, అతను పెళ్ళిచేసుకోమని అడిగితే, తల్లిదండ్రులకు పెద్దగా ఇష్టం లేకపోయినా, అతనితో అమెరికా వచ్చింది లమాయి. ఎంతో శ్రద్ధగా, తనవైపునుంచి ఎలాంటి లోటూ రాకుండా అతనికి సేవలు చేసినా, పన్నెండు సంవత్సరాల తర్వాత తల్లినీ కూతురునూ వెళ్ళిపొమ్మన్నాడతను. అప్పటినుండీ ఒక ఏపార్ట్మెంట్లో ఉంటూ, క్రోగర్లో పనిచేస్తూ, కూతుర్ని పెంచుకుంటుందామె.

నీకోసమే నేను ఇదంతా చేశాను అని ఆమె మాలీతో ఎప్పుడూ అనకపోయినా, థాయ్ లాండ్ లో ఉన్న తాత అమ్మమ్మలతోనూ, ముఖ్యంగా చిన్నమ్మకోసుమ్ తోనూ లమాయి ఫోన్లో మాట్లాడేటప్పుడు తను చాలాసార్లు విన్నది మాలీ. తన జీవితం నాశనం అయిందనీ, కనీసం మాలీని చదివించుకోగలిగితే, ఆ అమ్మాయికి మంచి జీవితం ఏర్పడితే తన కష్టాలకు ఫలితం దొరికినట్లేనని ఆమె చెప్తుంటుంది.

తల్లి మనసు తెలిసినా, ఆమె మీద అమితమైన ప్రేమ ఉన్నా, గౌరవం అయితే లేదు మాలీకి. గతంలో ఆమె తీసుకున్న నిర్ణయాలు బొత్తిగా బుద్ధిలేనివనిపిస్తుంది మాలీకి. పైగా తనకు జాగ్రత్తలు చెప్తుంటుందామె. మగపిల్లలతో స్నేహం చెయ్యవద్దనీ, అలాంటి స్నేహాలు చేస్తే పిల్లలు పుడతారనీ తను తొమ్మిదోతరగతికి వచ్చినప్పటినుంచీ నెలకొకసారైనా చెప్తూనే ఉంది. ఆమెకు నిజంగా మగవాళ్ల గురించి తెలుసా? కూతురుకి సంవత్సరం కూడా రాకముందే వదిలేసిన వాణ్ణి ఎలా ఎంచుకుని పెళ్ళి చేసుకుందామె? సెక్స్ కోసం థాయ్ లాండ్ వచ్చిన థామస్ ని ఎలా నమ్మి పెళ్ళిచేసుకుంది? అతని కోసం తనవాళ్ళందరినీ వదిలిపెట్టి అమెరికా ఎందుకొచ్చింది? తనకు నీతులూ జాగ్రత్తలూ చెప్పే అధికారం, తెలివితేటలూ ఆమెకసలు ఉన్నాయా?

ఆర్థిక కారణాలవల్లే అమెరికా వచ్చిందనుకున్నా, అలా రాకూడదనీ, తనకాళ్ళమీదే నిలబడాలనీ ఆమెకు ఇంకా అర్థం అయినట్లు లేదు. ఇప్పుడు మళ్ళా నన్ను కాలేజీకి పంపించేందుకు ఎవరితోనో సంబంధం పెట్టుకోవాలని చూస్తుంది. అలాంటి మనిషిని ఎలా గౌరవించడం?

తన చదువు ఖర్చులకు ఆమె తన జీవితం పాడుచేసుకోనవసరం లేదు. ఆ విషయం ఆమెకెలాచెప్పడం? ఎలా చెప్తే వింటుంది?

ఇంతలో ఆరుంబావైందనీ, పదిహేను నిమిషాల్లో లైబ్రరీ మూసేస్తారని ప్రకటన వినగానే ఆలోచనల్లోంచి బయటికొచ్చింది మాలీ. ఇంటికివెళ్ళి, తయారై, ఎనిమిది గంటలకు హాస్పిటల్ కి కెళ్ళాలి.

*

కెవిన్ వెళ్ళిపోయింతర్వాత గిన్నెలు కడిగి వంటగది సర్దుతున్నప్పుడు ఇంటికి వచ్చింది మాలీ.

తను భోజనానికి పిల్చిన స్నేహితుడు ఇప్పుడే వెళ్ళిపోయాడనీ, మాలీ ఉన్నట్లయితే బాగుండేదనీ అంది లమాయి.

ఇలాంటి సందర్భం వస్తుందని కొన్నాళ్ళుగా అనుకుంటున్న మాలీ, "ఎవరతను? అతన్ని పెళ్ళిచేసుకుందామనుకుంటున్నావా?" అని అడిగింది.

అతను క్రోగర్లో ఒక మేనేజర్ అనీ, పెళ్ళి గురించి ఆలోచించలేదనీ, అసలా ప్రస్తావన రాలేదనీ అంది లమాయి.

"మే, నీకు చెప్పడం మర్చిపోయాను. డిట్రాయట్లో వెయిన్ స్టేట్ యూనివర్సిటీకి దగ్గరగా ఒక ఏపార్ట్ మెంట్ తీసుకున్నాను. రెండు వారాల్లో, మే ఫస్ట్ న దాంట్లోకి మారాలి," అంది మాలీ నిర్లిప్తంగా.

లమాయికి షాక్ కొట్టినట్లయింది. వెంటనే ఏం మాట్లాడలేకపోయిందామె. ఏదోఒకరోజు మాలీని కాలేజికి పంపించాలనీ, అది దూరంగా ఉన్న కాలేజీ అయితే ఆ అమ్మాయిని ఇంటికి దూరంగా పంపించడం తప్పదు అనీ తెలిసినా, మానసికంగా దానికి తయారుగా ఉండాలని అనుకున్నా, అకారణంగా మాలీ ఇలా ఇల్లు వదలి వెళ్తుందని ఆమె ఎప్పుడూ ఊహించలేదు. నీరసపడిపోయిందామె. తను అన్ని విధాలా వోడిపోయినట్లనిపించింది.

తనేం తప్పుచేసింది? మాలీ ఇలా వెళ్ళిపోతే తను పరాయిదేశంలో, తాడూబొంగరం లేని జీవితం గడపటం ఎందుకు?

తను నమ్మిన మగవాళ్లు తనకు తోడుగా నిలబడలేదు. అది ఎవరితప్పూ? తను సర్వస్వంగా పెంచిన కూతురికి తనమీద గౌరవం లేదు. ఇక తను చెయ్యగలిగిందేమిటీ? కూతురుకి రెక్కలొచ్చాయి. ఆమె జీవితం తన జీవితం లాగా కాకూడదని ఆశించడం మాత్రమే ఇక తను చెయ్యగలిగింది.

"సరే నీ ఇష్టం," అని అటువైపు తిరిగింది లమాయి, కళ్ళు తుడుచుకుంటూ.

ఆమె మనసు తెలిసిన మాలీ, మెల్లగా ఆమెదగ్గరకెళ్ళి, ఆమె చేతిని తన చేతుల్లోకి తీసుకుని, "మే, నేను దగ్గరలోనే ఉంటానుకదా? డిట్రాయట్ ఇక్కడకి ఇరవైమైళ్ళే. అప్పుడప్పుడూ వచ్చిపోతుంటాను గదా," అంది.

"సరే," అంది లమాయి, కిందికి చూస్తూనే.

ఆమెను కౌగలించుకుని, "నువ్వు నాగురించి విచారించొద్దు. ఈ దేశంలో చాలామంది అప్పుచేసి చదువుకుంటారు. నేనూ అప్పుచేసి చదువుకోగలను. నువ్వు నాకోసం సంబంధాలు పెట్టుకోవద్దు. నీ గురించి ఆలోచించుకో. అది చాలు నాకు," అని తల నిమురుతూ ఓదార్చింది కూతురు. తలూపింది లమాయి.

మాలీ కళ్ళలోకి చూసిందామె. ఈ అమ్మాయితో మాట్లాడాలంటేనే భయంగా ఉండేది ఇన్నాళ్ళు. ఆ కళ్ళల్లో ఇప్పుడు కోపం లేదు. అసహ్యం లేదు. విచారం లేదు. స్నేహ భావం నిండిన కళ్ళు!

కూతురు చాలా ఎదిగినట్లనిపించిందామెకు. ఇది వరకు లేని ధైర్యం ఆమెను ఆవహించింది.

"సరే, తిందామ్ రా. నీ కిష్టమైన వంటలు చేశాను," అని మాలీని చెయ్యిపట్టుకుని వంటగది వైపు నడిపించింది లమాయి.

**కౌముది వెబ్ మాసపత్రిక, ఫెబ్రువరి 1, 2020**